The First Telugu Biweekly in Andhra Desa The only Telugu Newspaper
H. E. H. The Nizam's Dominions

# గోలకొండపత్రిక

తూర్పు బజారు, హైదరాబాదు, (దక్కన్.)

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపబడును

| | |
|---|---|
| సం॥చందారూ | ౬-౦-౦ |
| అర్థ ,, ,, | ౩-౦-౦ |
| విడి ప్రతిక | ౦-౧-౦ |

**GOLKONDA PATRIKA**

HYDERABAD, Dn MONDAY 7-5-1934

ఒకవారముతరువాత ప్రాతపత్రిక కోరినచో వెలకు పరిమితిలేదు.

సంపుటము ౬ } శా.శ.౧౮౫౬ శ్రీభావనామసం॥ అధిక వైశాఖ బ॥ ౯ సోమవారము ౨౧-౮-౪౩ ఫ. { సంచిక ౧


## నీలంసబ్బు తంత్రము!




గుడ్డలను చక్కగా పరిశుద్ధిచేయు పదార్థముతో గూడ శాస్త్రప్రకారము నీలము కలుపబడియున్నచో, కట్టకడపట నీలిలో ముంచకరే శుద్ధి మరికొంత ఎక్కువఅగును, గుడ్డ చెడిపోకుండును, మొత్తముమీద శుద్ధిచేయుటకగు ఖర్చున్ను తగ్గును. ఇతరసబ్బుల నువలెనే నీలంసబ్బును పట్టించుము, తర్వాత పూర్తిగా శుభ్రము చేయుము. అప్పుడు మరిచూడుము, ఫలితము అద్భుతమని నీకే తెలియగలదు.

తయారుచేయువారు —

ది వెజిటబిల్ సోప్‌వర్క్సు, కాలికట్

ప్రొప్రైటర్లు:- సెట్ యస్. పి. అండుకో, (సూర్యమార్కు గొడుగులకు ప్రసిద్ధికెక్కినవారు),





## మంచి జర్దా

దేశ్ముఖ్ నజర్ అలీఖాన్ కాలా జరదా తలిపుసూర్లోనే నిరాలాజరద పాకిజాగా అనేక జాతులతో అనిలియాజ్జు యహీమన్ను. అంబర్ నేట్ అలాహై పట్నాలజరద.

దుకాన్ —

తేపాక్సంపని సుల్తానుబజారు హైదరాబాదు దక

తులా ధర ౧—౦ ...

Dr. M. V. NAIDU, L. C. P S M. B, O. S.
The Modern Eye Clinic
Market Street
Secunderabad.

కండ్లనుంచి విస్తారముగా నీరుకారుట, ఎరుపులు, మందమైనకనుచెప్పలు, పరాలు వగయిరాలు గ్యారంటీగా బాగు చేయబడును తగిన సులోచనము న్యాయమైనధరలకు అమర్చబడును

డాక్టరు. ఎమ్. వెంకటసుబ్బనాయుడు
నేత్రవైద్య నిపుణులు.
మార్కెటువీధి సికిందరాబాదు

ఆయుర్వేద భూషణ పండిత ... శాస్త్రి
M A C వారి

## స్ఫోటక సంజీవిని

అటలమ్మ అమ్మతల్లి మొదలగు అంటువ్యాధులను రాకుండచేయుటకును కుదుర్చుటయందును అమోఘమయినది. వ్యాధి ప్రదేశములలో ప్రతి ఇంట నుండదగినది. బుడ్డి వెల 1 కి రూ 1-4-0
6619 నెం॥ ఇమాంబావిడీ చరకనికేతనం
సికింద్రాబాదు.

ప్రకటన

ప్రతినిధులులేని కొన్ని ప్రదేశములలో కిరసనాయిలు విక్రయించుటకు ... కోరబడుచున్నవి
దరఖాస్తులను పంపుడు —
బొంబాయి పెట్రోలియం కంపెని, లిమిటెడ్,
హార్న్‌బిరోడ్డు, బొంబాయి

## శ్రీ కృష్ణాభవను హొటల్

ఆబిడ్ బిల్డింగు హైదరాబాదు

రుచ్యమగు ఫలాహారములు, మంచిభోజనము ప్రత్యేకముగ విశ్రాంతి సౌకర్యములు అన్నియు చౌకధరలలో లభింపగలవు. కొత్తవారి సామానులుకూడ ఇచట ఉంచబడును.

కే. యస్. కృష్ణయ్య ప్రొప్రయిటర్
**Krishna Bhavan Hotel.**

(పదవ పేజీ తరువాయి)

జ్ఞానము గలిగెను. ఇప్పుడువారు పూర్వపు హైందవ స్త్రీలవలె విద్యాశక్తుల నార్జింప మొదలిడిరి. ప్రస్తుతము పాశ్చాత్యదేశపుస్త్రీలు విద్యాసంపన్నులై సకలవిధములైన హక్కులను పొందియున్నారు. వారు చోరవశ్యములుగాని, సభలుగాని, సంస్థలుగాని, సంఘములుగాని, కర్మాగారములుగాని, యుద్యోగశాఖలుగాని లేవనియే చెప్పవచ్చును. పురుషునకెంత పలుకుబడియున్నదో అంతకంటె యెక్కువనే నేటిస్త్రీలకున్నది.

పార్లమెంటునందు స్త్రీలు మెంబర్లగ నున్నారు. న్యాయస్థానములందు వారే న్యాయాధీశులుగను, వైద్యాలయములందు వారే చికిత్సకులుగ నున్నారు. విద్యాపాండిత్యముచే స్త్రీలు గూడ నెన్నియో యంత్రములను కనిపెట్టుచున్నారు. వేయేల, నేడు పాశ్చాత్యదేశమునందు స్త్రీసంపూర్ణదశను పొందియున్నది.

కాని మన హిందూదేశములో, స్త్రీకి అంతఅదృష్టమింకను పట్టలేదు. ఇచ్చటి స్త్రీకి అంత అదృష్టమింకను పట్టలేదు. ఇచ్చటిస్త్రీ కిప్పటికి నన్నియో యాటంకములు నిర్బంధము లున్నవి. వీని కన్నిటికిని కారణములు విద్యావిహీనత, జాతిమత భేదములు, సాంఘిక దురాచారములు.

---


# కిర్లోస్కర్ పంపులు

ఇవి చిన్నవియు పెద్దవియు పలురకములు వలువురికోరికలకు తగినట్లు అనేకములు చేయబడియున్నవి. మీకు ఇంటిలో ఉపయోగించుకొనుటకైనను, పొలములకు నీరుతోడుటకైనను, యంత్రాలయములలో ఉపయోగించుటకైనను పంపు కావలసినయెడల మావద్దనుండువాటిలో సరిగా సరిపోవునదొకటి దొరకగలదు.

ఇండియాఅంతటను వేలకొలది ఉపయోగింపబడుచున్నవి

కొన్నట్ల క్యేటలాగు నడుగుడు.

## కిర్లోస్కర్ బ్రదర్స్ లిమిటెడ్

కిర్లోస్కర్వాడి, (జిల్లా సతారా.)


హైదరాబాదు

## బజారు ధరలు

(కోడూరపు లక్ష్మీనరసయ్య ఉస్మాన్ గంజి)

7—5—1934

| | | | |
|---|---|---|---|
| గోధుమలు:-జెలాల్యమొదలుపల్లా1కి రు | | 13 | 0 |
| బియ్యము:—దొడ్డువి | ము | 11 | 0 |
| నానకరాంలు కొత్తవి | ము | 11 | 8 |
| | వరకు | 12 | 0 |
| డిటో | పాతవి ము | 12 | 0 |
| | వరకు | 12 | 8 |
| ,, క్రిచిసాంబారులు | కొత్తవి,, | 12 | 0 |
| డిటో | పాతవి | 14 | 8 |
| ,, రామసాగరాలు | కొత్తవి | 10 | 12 |
| డిటో | పాతవి | 11 | 12 |
| సిహోడీలు | మొదలు | 20 | 0 |
| | వరకు | 25 | 0 |
| కందులు | పెద్దవి | 9 | 8 |
| | వరకు | 9 | 12 |
| | చిన్నవి ము | 8 | 14 |
| | వరకు | 9 | 0 |
| కందిపప్పు | పెద్దది ము | 13 | 12 |
| | వరకు | 12 | 8 |
| పచ్చపెసలు | | 8 | 8 |
| పెసలపప్పు | | 14 | 0 |
| నల్లపెసలు | | 5 | 12 |
| మినుములు | | 7 | 4 |
| మినప పప్పు | | 12 | 4 |
| ఉలవలు | | 4 | 4 |
| జొన్నలు | | 8 | 8 |
| శిరిసెనగలు | | 11 | 4 |
| వుప్పు | | 11 | 12 |
| తవుడు | | 3 | 12 |
| పత్తిగింజలు | ము | 6 | 1 |
| అలచందలు | | 7 | 8 |
| అనుములు | | 6 | 0 |
| బటానాలు | | 7 | 2 |
| బెల్లము | | 14 | 15 |
| ఎఱ్ఱచక్కెర | | 14 | 1 |
| వేరుసెనగ గింజలు | చిన్నవి ము | 8 | 4 |
| పసుపు | | 13 | 0 |
| | వరకు | 14 | 0 |
| మిరపకాయలు | మొదలు ,, | 50 | 0 |
| | వరకు ,, | 56 | 0 |
| చింతపండు ము | | 7 | 4 |
| | వరకు | 7 | 8 |
| మెంతులు మంచివి 16 సేర్లకు | | 1 | 10 |
| అల్లం 12 సేర్లకు | మొదలు | 1 | 2 |
| వేరుశెనగనూనె | శె 12 కి | 2 | 2 |
| నెయ్యి | శె 40కి | 35 | 0 |
| తెల్లగడ్డలు | ము శె 12 కి | 1 | 4 |
| | వరకు | 1 | 8 |
| ఎఱ్ఱగడ్డలు | పల్లా1కి ము | 3 | 0 |
| | వరకు | 3 | 8 |
| మ్రదాసు చక్కెర | దొడ్డుది | 1 | 10 |
| సెనగలు | ము | 10 | 4 |
| సెనగపప్పు | ము | 13 | 0 |

---

## ప్రకటన

అజు దఫ్తరు పింగిలి వేంకటరామారెడ్డి దేశముఖు సుల్తానుబజారు హైదరాబాదుదక్కను చ ౫౫ ఖుర్దాదు ౧౩౪౩ ఫ.

దీనివలన అందరికి తెలియజేయుట యేమనగా—రెండుకిత్తాల భూమి 72842 చ. గజముల విస్తీర్ణముగలది, ఆలీజనాబు నవాబు హాజీ మహమ్మదువలీ దాద్ ఖాన్ సా. మందోడ వ కీ శే. నవాబు గులాంఅహమదు ఖాన్ సా జమూదారు వ జాగీరుదారు సాకిన్ షకర్ కోటు హైదరాబాదుగారిది వారివద్ద ఖరీదుచేసినాను. బయానా యిచ్చి బైనామకొరకు యకరారునామ తీసుకొనబడినది. ఒకవారము రోజులతర్వాత తక్కిన రకమియిచ్చి బైనామారిజిస్టరు చేయించుకొబడును.

ఒకవేళ ఈబయనామ విషయములో ఎవరికిగాని ఏదైన ఆక్షేపణయున్నయెడల అనగా సదరుభూమిలో హిస్సాగాని లోగా యెవరికైనా బైగాని రహీన్ గాని మరి ఏవిధమైన ఆక్షేపణగాని యున్నయెడల ఒక వారమురోజులలోగా నాకు దాని తప్సీలి యిత్తిలా యివ్వవలసినది. ఎందుననగా ఆయాక్షేపణ విషయమై తగుపరిష్కారముచేసి బై చేయించుకొబడును. ఏఆక్షేపణయు రానియెడల, ఎవరికిని ఇందులో వుజరులేదని తలంచి విక్రయము చేయించుకొబడును. తరువాత ఎవరి ఆక్షేపణయు చెల్లనేరదు.

బైచేయించుకొనబడిన భూమియొక్క వివరములు:—

[౧] మొదటికిత్తా—వాదీమాట్ లేక రాఘిబాగిలి, వాకే కుంట గోపాలుపాలు మువాజె సుమారు ౫౭౨౦౯౦ చ. గజములు (ఇది ప్రతాపబాగునకును, మాల్వీఅబ్దుల గఫూరు సాహెబు రుకనుగారి అద్దారుఖానాకు వెనుకఉన్నది).

దీనికి ఉత్తరమున కడకును, మురుగు కాలువయును, వ కీ. శే. అబ్దులగఫూరుఖాను సాహెబు రుకనుగారిభూమి.

తూరుపు కీ. శే. అబ్దులగఫూరుఖాను సాహెబుగారి భూమి.

దక్షిణము. ప్రతాపబాగు.

పడమర. అబ్దులు సైపాహా సాహెబు ఖర్రీ అల్లాదరిగారి స్వంతముగు షేరోజాబాగు.

[౨] రెండవకిత్తా—కచ్చైలమండి పేరుగలది. గాజుల మసీదువద్ద, వాకే కుంట గోపాలుపాలు సుమారు ౧౬౨౪౨ చ గజములు (ప్రహారిగోడలతో సహా)

దీనికి ఉత్తరమున గౌడవూరాయున్న,

తూరుపున భద్దు ఇన్నింటరీ హ్యాండు తైనున్న

దక్షిణమున గోపాలుపాలు సడకను

పడమట దరగా రోడుగలదు.

---


## ది జనరల్ అష్యూరెన్సు సొసైటీ, లిమిటెడ్, అజ్మీర్.

ఈ క్రింది సంఖ్యలే మాస్థితిని తెలుపగలవు.

అమలులోనుండు భీమామొత్తము—రూ ౨౫౦౦౦౦౦౦ | సంవత్సరాదాయము — రు ౧౫౦౦౦౦౦

పెట్టుబడిలోనున్న ఫండు— ,, ౫౦౦౦౦౦౦ | చెల్లించివేయబడిన క్లెయిములు—౨౫౦౦౦౦౦

౧౯౩౩ వాల్యుయేషన్ సంవత్సరపు బోనసు

(ఇదివరలో చెల్లించినది)

## సంవత్సరమునకు వేయింటికి ౨౫౹

భీమాచేయుటకును ఏజెన్సీతీసుకొనుటకును ఇంతకంటె మంచిజీవిత భీమా సంస్థలేదు. ఏజంట్లు కావలెను. దరఖాస్తులను క్రింది అడ్రెసుకు పంపుడు:—

**ఎస్. ఆర్. సర్దేశాయి** చీఫ్ యేజంట్ (లేదా) **ఎస్. టి. కృష్ణారావు** ఆర్గనైజర్,

౧౯౯ గిర్గాం రోడ్డు, బొంబాయి నెం. ౪ | ౧౫౧౩, రెసిడెన్సీబజారు, హైదరాబాదు (దక్కను)

## గోలకొండ సంవత్సరాదిసంచిక

ఈ సంచిక నేడే వెలువడుచున్నది. ఇందు రాజకీయ, సాంఘిక, సారస్వత విషయికములగు వ్యాసములు గలవు. మొత్తముపై నించుమించుగ ౮౦ పుటలు గలవు. ముఖ్యముగ నిజామురాష్ట్ర రాజ్యాంగమునకు సంబంధించిన ప్రత్యేకవ్యాసములు, కథలు చదువదగినవి.

ఈ సంచికయందు శ్రీనిజాంప్రభువుగారు, యువరాజుగారు, ప్రధాన మంత్రిగారు, నిజాముల ముల్కు, రాజా చందూలాలు, సర్ సాలార్జంగు, గోలకొండ పత్రికా రాజపోషకులు మొదలగువారి చక్కని పటములు గలవు.

సంచిక చక్కని యాకృతిలో నున్నది. చందాదారుల కుచితము పరస్థానిక చందాదారులు తపాలుఖర్చులక్రింద రెండుఅణాల పోష్టు బిళ్లలు పంపినవెంటనే సంచిక పంపబడును.

చందాదారులు కానివారలకు వెల ఎనిమిది అణాలు, పోస్టుఖర్చులు రెండు అణాలు.

వ్యవస్థాపకుడు

---

గోలకొండ పత్రిక

(శ్రీభావనామ సం॥ అధిక వైశాఖ బ॥ ...

సోమవారము

## మా తొమ్మిదవ సంవత్సరము

మాపత్రిక నేటితో ఎనిమిది సంవత్సరములను పూర్తిచేసి తొమ్మిదవ సంవత్సరమున ప్రవేశించినది. ఎప్పటివలెనే దాటింపవలసిన రాజకీయార్థికాదులైన గండములు దాటింపబడినవి.

గతసంవత్సరము మేము వీలైనంతవరకు, చేతనైనంతవరకు, పత్రికను ఎక్కువగా ప్రజల కుపయోగకరమగునట్లుగా నడపితిమని తలచుచున్నాము. ఈసంవత్సరము అనేకములగు మార్పులు చేయబడుచున్నవి పత్రికయొక్క సంవత్సరపు చందా ౭ రూపాయిలకు బదులు ౬ రూపాయిలే చేయబడినది. అర్ధసంవత్సరము చందా రూ౩-౧౨-౦ లకు మారుగా ౩ రూపాయిలే చేయబడినది విడిపత్రిక ఖరీదు రూ ౦-౧-౪ లకు మారుగా ౧ అణా చేయబడినది. చందా తగ్గించినను పత్రిక యొక్క పుటలు తగ్గించుటకు మారుగా ౧౨ పుటలనుండి ౧౬ పుటలవరకు హెచ్చింపబడినవి. మా చందాదారులును చందాదారులు కాని యాంధ్రులును ఈవిషయములను గమనింప బ్రార్థితులు.

స్థానికములగు [illegible] పత్రిక [illegible] దీనిపోషణ [illegible] విశ్వాసము [illegible] పత్రిక [illegible] విషయ [illegible] హెచ్చు [illegible] హెచ్చు [illegible] అంధ్రదేశము [illegible] పత్రిక [illegible] తమపై కష్టించుచున్నట్టి [illegible] ఎక్కువగా నుండుటకు కారణము దురూహ్యము.

మనరాష్ట్రములో నిటీవల జనాభా ప్రకారము

| | |
|---|---|
| ఆంధ్రులు | ౬౯,౭౩,౫౪౨౮ |
| మహారాష్ట్రులు | ౩౭,౮౬,౮౩౮ |
| కన్నడీలు | ౧౬,౨౦,౯౯౪ |
| ఉర్దూ మాట్లాడువారు హిందీతో సహా | ౧౫,౦౭,౨౭౯ |

దీనివలన తేలినదేమన అన్నిభాషలలో నాంధ్రభాషను మాట్లాడువారి సంఖ్యయే యెక్కువ మరి మనరాష్ట్రములో పత్రికల వివరము చూడుడు.

| | దినపత్రిక | వారపత్రిక | మాసపత్రిక |
|---|---|---|---|
| ఆంధ్రము | లేదు | అర్ధవారపత్రిక ఒకటి | లేదు |
| కన్నడము | ,, | శూన్యము | సున్న |
| మహారాష్ట్రము | ,, | ఒకటి | ఒకటి |
| ఉర్దూ | ౫ | ౨ | ౫ |

అనగా ౭౦ లక్షల ఆంధ్రుల కొకేపత్రిక. అదియు బౌలాదిష్టములచేతనే గాక ప్రబలమైన భూతాదిష్టములచేతను పీడింపబడుచున్నది. ఈపరిస్థితులనుజూడ మనమెంత వెచ్చుసరకో వేరుగా చెప్పవలసిన అవసరములేదు. మనరాష్ట్రాంధ్రులలో నెంతటినిస్తేజము, యెంతటిహృదయదౌర్బల్యము, యెంతటి భాషా విముఖతయున్నదో చూడుడు

పత్రికాపఠనము నాగరిక ప్రపంచములో ఆహారమువలె అవసరకార్యమై పోయినది. దినమొక్క పత్రికను మాత్రమే చదివి తనివిపొందుటలేదు. పూటకొక పత్రికను చదువుచున్నారు ఇంగ్లాండులో జట్కావాలాలుకూడ మూడుపూటల మూడుపత్రికలు కొని చదువుచున్నారు డెయిలీ మెయిలువంటి పత్రికలకువ్యాప్తి ప్రతిదినము ౩౦ లక్షలకన్న హెచ్చుగా నున్నది మనదేశములో ౧ లక్షవరకైనను చందాదారులుగల పత్రికయే లేదు తెలుగుపత్రికలను విచారించువారు అంతకంటెముందే తక్కువ అందులో నిజాంరాష్ట్రాంధ్రభాష రెంటికిచెడ్డిన రేవనిగతి నొందియున్నది.

దేశాభిమానము. భాషాభిమానము లేని జాతి త్వరలో నశించును ఎవరైననుసరే లేక ఏ ప్రభుత్వమైననుసరే ఏభాషనైన నాశము చేయజాలరు ఆభాషను మాట్లాడుజనులను బహుకాలమువరకు నిస్తేజులనుగాచేసి పిరికివారినిగా జేసి లాభము పొందవచ్చును కాని భాషమాత్ర మెప్పటికిని చావదని సూక్షిగానమ్ముడు. ఐర్లండు దేశపుభాషను ౭౦౦ ఏండ్లక్రిందటనే యింగ్లీషువారణచిపెట్టిరి ఐర్లండలో నాటికి ౯౦ మంది యింగ్లీషుభాషనే యభ్యసించిరి కానితుపాను రీతి యొక్కమారు జాతీయవాతాఘాతముచే యింగ్లీషుభాష రూపుమాసెను మాసిన ఐరిసు చదువు మరలనభ్యసింపబడెను ఐస్లండు దేశము మిగులచిన్నది మనయొక్క జిల్లాలో సగమువంతుండునది కాని యీదీవివారి భాషనెవ్వరును ధ్వంసముచేయజాలకపోయిరి స్విట్జర్లాండు మనరాష్ట్రములోనాల్గవవంతున్న దేమో! అందు మూడుభాషలున్నవి, అన్నియు సమానాభివృద్ధి నొందున్నవి. మొగలాయిరాజుల కాలములో హిందూస్థానమంతటను జూడగను ఫారసీ బాషయే ప్రభుత్వభాషయై యుండెను "పఢెఫారసీ బేచె తేల్" [illegible] [సేర్ యింగ్లీషు [illegible] ఇంగ్లీషు చదువు [illegible] రెండు తావుల నిలికివచ్చెనది] [illegible] మొగల్ సామ్రాజ్య మేక్షణముగూలెనో ఫార్సీభాష ఆక్షణమే రూపరే ఖలులేకుండపోయి యేమూల్వీలయిండ్లలోవలనో దాగికొనెను. కావున ఆంధ్రులను, వారిభాషను ఎవ్వరైననుసరే, ఏయధికారులైనను, ఏవిశ్వవిద్యాలయములైననుసరే, ఏసంస్థలైననుసరే, యెన్నటికినినశింపజేయజాలరు. ఫుట్టచెండువలె కొట్టకొలది మరింత యౌన్నత్యము నొందును. ఇట్లు భాషకు నశించు స్వభావము లేనప్పుడు దానిపై అభిమానము నుంచుకొని జాతినినశించకుండ కాపాడుకొనుటకు ఉపేక్ష చేయువారి అవివేకము నేమనవలెను?

ఆంధ్రులందరు మేముచేయుకృషినిఅభినందించి సర్వవిధములతోడ్పడిమాకు త్సాహము నిచ్చియీ పత్రిక దైనందినాభివృద్ధికలదైఎక్కువ ప్రజాసేవయు ప్రభుత్వసేవయుచేయునట్లు పురికొల్పుదురని మేము విశ్వసించుచున్నాము.

## మునిసిపాలిటీ ఎన్నికలు

మునిసిపాలిటీ ఎన్నికలకై ప్రయత్నములు చురుకుగా జరుగుచున్నవి. అభ్యర్థులు విశేషముగా నిల్చుచున్నారు. ఈ సందర్భమున మాకు కొన్ని విశేషములు గోచరించుచున్నవి. వాని నిచ్చట చర్చింతుము.

మొదటిది, ప్రభుత్వోద్యోగులుఅభ్యర్థులుగానిలుచుటసాధారణముగానాగరిక దేశములందు శాసనసభలు, మునిసిపాలిటీలు మొదలకుస్థానిక స్వపరిపాలనా సంస్థలలో ప్రభుత్వోద్యోగులు సభ్యులగుటకై ఎన్నికలలో పోటీచేయు పద్ధతిగానరాదు. ఈ పద్ధతి లేకుండుటకు కారణములు స్పష్టములే. ప్రభుత్వోద్యోగములలోనుండువారు ఎన్నికలలో దిగి స్వపరిపాలనా సంస్థలలో సభ్యులగుటవలన, ఇటు ప్రజలకోరికలనుగాని, అటుప్రభుత్వ విధులనుగాని సంతృప్తికరముగా తీర్చజాలరు. ఎన్నికలరుచి మరగినవానికి దైనందినప్రభుత్వ కార్యములపైరుచితప్పును. స్థానికస్వపరిపాలనాసంస్థలలోఆలోచనలు, చర్చలు, వాదములు — వీనితీరు వేఱు; ప్రభుత్వాధికారులకు లోబడి చెప్పినట్లు పని చేయుచుండుట వేరు, ఈరెంటికిని పొసగదు. ప్రజలతరఫున ఎన్నుకొనబడినవారు ప్రభుత్వమువారుఅనుకొనుదానికి విరుద్ధమైనను ప్రజలకోరికలను ధైర్యముతో సమర్థింపవలసియుండును ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వము చెప్పినట్లుచేయుచుండవలసినవారుగనుకఆ ధైర్యము ఉండజాలదు,ఒకవేళ ధైర్యముచేసినచో ప్రభుత్వోద్యోగమునకు స్వస్తిచెప్ప వలసియుండును ప్రభుత్వోద్యోగులు అనధికారసభ్యులుగానుండు స్వపరిపాలనా సంస్థలు చిరకాలము ప్రజల విశ్వాసమును నిల్పుకొనజాలవు కాబట్టియే, నాగరిక దేశములన్నిటిలోను ప్రభుత్వోద్యోగులు స్వపరిపాలనాసంస్థలందు అనధికారసభ్యులుగా ఎన్నుకొనబడుట గానము

ఇప్పుడు మన నగరములో మునిసిపాలిటీ ఎన్నికలకై జరుగుచున్న పోటీలలో కొందరుప్రభుత్వోద్యోగులు నిలుచుచున్నట్లు తెలియవచ్చినది [illegible] విశ్వవిద్యాలయ [illegible] అధ్యాపకులలో [illegible] [illegible] [illegible] [illegible] తెలియవచ్చినది [illegible] ప్రభుత్వోద్యోగులు అభ్యర్థులుగా తామేనిలచినను, [illegible] ప్రోత్సాహము చేసినను ఫలితమొకటియే.

ధముగ ఆంధ్రరాజులుకూడ తమ పేళ్లను తమ బిడ్డల పేళ్లను శిలా శాసనములపై చెక్కించుచుండిరి. ఆంధ్రరాజులలో గౌతమీపుత్రశాతకర్ణియనువాడు గౌతమియను తల్లిపేరును తనదానితో చేర్చుకొనెను.

ఈవిధముగ స్త్రీలకు సాంఘికస్థితియందు ప్రాధాన్యమును, గౌరవమును లభించసాగెను. ఈజిప్టులో పురాతన శాసనములందు స్త్రీలు (Neb-t-ompa) యనియు (Ned-tur-pa) యనియు పేర్కొనబడియున్నది. అనగా, గృహ యజమానియనియు, శ్రేష్ఠమైన గృహాధికారిణియనియు నర్థము. (Diodorous) అనువాడు ఈజిప్టుదేశపు రాణియే రాజుకంటె నెక్కువ గౌరవాధికారములను గలిగియుండెననియు, మరియువారి వివాహకాలమందు పురుషుడే స్త్రీకి విధేయతా ప్రమాణము చేయుచుండెననియు, రాణియొక్క ఆస్తియామెకె స్వంతమనియు, రాజు తనయాస్తిని తన రక్తసంబంధ బాంధవులనగా, సోదరిపుత్రుల కొసంగుచుండెననియు చెప్పుచున్నారు.

మాతృ వంశవార సత్వాచార కారణమువలననే, సోదరుడు సోదరిని వివాహమాడు నాచారముకూడ నేర్పడెను ఈజిప్టురాజైన రెండవటాలమి (Ptolemy II) (౨౮౫-౨౪౭) (Philadelpos) యను బిరుదును వహించియుండెను (సోదరిని వరించినవాడు) అతడు పూర్వాచారము ననుసరించి తన చెలియలైన "అర్సినో"యనునామెను సతిగా చేసెను.

(Ethiopians) ఏథ్యోపియన్సులలో రాజులు రాజ్యమును తమపుత్రుల కొసంగుటలేదు. కాని, తమసోదరి సంతానమునకే యిచ్చుచుండిరి. ఆ యాచారమే నేటికిని టిబెట్టులోనున్నది మలబారుదేశములో నేటికి సోదరియు యామెసంతానములే వారసులగుచున్నారు. "ఒకానొక మానవునితో యాతని వంశమునుగురించి విచారించిన యతడు వెంటనే తనతల్లిపేరును తెలుపును. ఒకసద్వంశ స్త్రీకిని యొక బానిసకును జన్మించినశిశువు న్యాయప్రకారముగ మంచివంశమునకే జెందును కాని యొక బానిసస్త్రీకిని యొకానొక గొప్పవంశజునికి పుట్టినబిడ్డ బానిసయనియే పిలువబడును వలన, శిశువుయొక్క ఉచ్చనీచతలు తల్లికి సంబంధించినవిగాని, తండ్రికిగాదు" అని హెరడోటస్ (Heredotus) డిశియనుల(Dycians) గురించి నుడివియున్నాడు. గ్రీకులలో వివాహములు నేడు ఘోషించునట్లు వధూవరుల ప్రేమతో సంబంధించినవిగా నుండలేదు ఆకాలపు కన్యలు అంతఃపురములలో (Gynaikonitis) పెరుగుచుండిరి. వారికి యుక్తవయస్సు వచ్చినతోడనే జననీజనకులు తగినవరున కొసంగుచుండిరి. వివాహానంతరము వారు భర్తకుజెందిన (Gynaikonitis) లో జేరుచుండిరి. విద్యలేకుండినను గృహకృత్యములలో నారితేరినవారై యుండిరి.

కాలక్రమమున గ్రీసులో రాజ్యాంగపు మార్పులు జరుగుకొలది, జనులలో పౌరసత్వపు హక్కులు అధికము కాజొచ్చినవి రాజ్యాంగ విషయములలో శ్రద్ధ యెక్కువగుకొలది వారికి సంసార విషయములో అశ్రద్ధ యెక్కువకాదొడగెను. కుటుంబమును రక్షించుటకై ఒకబానిస నేర్పాటుచేయుచుండిరి స్త్రీలు పురుషులతో సమత్వమును పొందజాలకుండిరి. వారిమాటలే రాజ్యాంగసభలలో వినబడకుండెను ఇదేసమయమునందు గ్రీసులో స్వేచ్ఛాస్త్రీలసంఘమొకటి బయలుదేరెను. వీరికే హెటెరియా Hetaria లనిపేరు. ఈ. (Aspasia.oympia) మొదలగు స్త్రీలు [illegible]లో చేరినవారే. వారు విద్యావిషయములో చాల పన్నెకెక్కియుండిరి. వారి శరీరసౌందర్యము మిగుల ఆకర్షణీయమై యుండెను.

"మేము బానిసలను మాకు సేవచేయుటకును, అవసరముల తీర్చుటకునై యుంచుకొందుము, కాని, హెటెరియాలను ప్రేమ ననుభవించుటకు మాత్రముంచుకొందుము"ని డెమాస్తినస్ ఒకసందర్భమున నుడివెను. "స్త్రీలను సృష్టించినటువంటి భగవంతుడు ఒకడున్నచో వాడెచ్చటనైన నుండనీగాక, అనవిని వినాశములకు పురికొల్పునటువంటి అపవిత్రుడనిభావింపవలసియున్నద"ని తుసిడైడిసు స్త్రీల విషయములో తన తీర్మానమును వెల్లడించెను.

కాలక్రమమున గమనించదగినటువంటి ఒకానొక మార్పు భాగ్యభోగములచే విరాజిల్లు ఏషియానుండి పశ్చిమ దేశము వైపునకు వ్యాపింపజొచ్చెను. మరియు హెటేరియా జాతితో జనులకు సంబంధ బాంధవ్యము లేర్పడసాగెను. క్రమముగ ఈహెటేరియాలే ముఖ్యపురుషుల యొక్క అర్ధాంగ, మాతృస్థానముల నలంకరింపజొచ్చిరి. వీరి విద్యాసామర్థ్యబలముచే వీరికి సంఘములందున్నత పదవులు దొరక నారంభించెను. వీరి సంతతి న్యాయమైనదిగా గణింపబడసాగెను.

ఐరోపా ఖండమునందలి నేటి ఉత్తేజనమునకును, కళాకౌశలమునకును, విద్యా పరిపూర్ణతకును ఈ హెటెరియాలే ముఖ్యకారకులు. స్త్రీలలో చలనము కలిగించినవారు కూడ వీరే.

పూర్వము రోములో స్త్రీలస్థితి గ్రీసు స్త్రీలకన్న మంచిదశయందుండెను. వివాహ సమయములందు భార్యచేతికి తాళపుగుత్తిని గృహయాజమాన్యపుగురుతుగనొసంగినప్పటికిని, ఒకలోహాంగుళీయమును భార్యాభర్తల దృఢసంబంధము తెలుపు గుర్తుగా వ్రేలియందుధరించినప్పటికిని, రోములో పురుషులే సర్వాధిపతులై యుండిరి. కాని గ్రీకుసతికి విరుద్ధముగ రోమనుసతి తన భర్తతో భుజించుటకును, సకలవిధములైన సంతోషముల ననుభవించుటకు హక్కుగలదై యుండెను. ఆమె కతిథుల కాతిథ్య మొసంగుటకు, ఇష్టముండిన స్థలముల కేగుటకును, సాక్షిగనో లేక మొఱవిన్నవించుటకో న్యాయస్థానముల కేగుటకును అధికారము గలిగి ఆమె తనయాస్తికి సర్వాధికారిణియై వానిని కాపాడు శక్తి కలదైయుండెను. సాధారణముగ శాసన సభలలోకూడ నామె పలుకుబడి హెచ్చుచుండెను. అందువలననే జ్యేష్ఠకేటో (195 క్రీ. పూ.) ఈక్రిందివిధముగ నొక బహిరంగ సభలో మొరపెట్టెను.

"ప్రతిచోటను పురుషులు స్త్రీలపై ఆధిపత్యమును వహించియున్నారు. మేము (రోమనులము) దేశములపై, మనుష్యులపై ఆధిపత్యము వహించి యున్నాముకాని, మా స్త్రీలు మాపై అధిపత్యము వహించియున్నారు. పురుషుని కుండవలసిన జ్ఞానము, శ్రేష్ఠత, స్త్రీల నడచియుంచుశక్తి మాకుండినచో సాధారణముగ స్త్రీలవలన గలుగు కష్టములకు మేము వశులము గాకుందుము. గృహవిషయములలోన, బహిరంగ విషయములలోను మా స్వాతంత్ర్యము మా స్త్రీలచే ముట్టడింపబడి యణగద్రొక్కబడెను. వారిశక్తుల నాటంకపరచుటకు సమర్థులమై యున్నాముగాన, వారి సంఘీభావశక్తికై వెఱచుచున్నాము.

నిజము చెప్పవలయునన్న వీరికి స్వాతంత్ర్యేచ్ఛలేదు. కాని పురుషునితో సమత్వపదవిని పొందినవెంటనే, వారిని వెనుకకునెట్టి తాము ముందున కేగవేయుటయే వీరి యభిలాష"

గ్రీకు నాగరికతా వ్యాపకము వలనను, రాజకీయాభివృద్ధివలనను కేటో నుడివినట్లుగనే స్త్రీ [illegible] యాధీనమునుండి [illegible] స్వేచ్ఛను పొందదొడగిరి. రోములో గ్రీసువలె హెటీరల స్వేచ్ఛాస్వాతంత్ర్యములు హాస్యాస్పదమై గౌరవహీనముగా పరిగణించసాగెను. కాల మతిక్రమించుకొలది గొప్పఅధికారుల స్త్రీలందరు శిక్షను తప్పించుటకై జారిణీల నేర్పరచిన రిజిస్టరులో తాము ను సంతకముచేయుచు, స్వేచ్ఛావిహారులై తమ కోరికలను నెరవేర్చుకొనుటకై విచ్చలవిడిగ విహరింపదొడంగిరి ఈ స్త్రీ స్వాతంత్ర్యము రాజకీయ విషయములలోకూడ ఆధిక్యతను సంపాదించుట మొదలిడెను

ఫుల్వియా యను యువిద తనభర్తయైన అంటోనియస్ క్లియోపాట్రావలలో జిక్కుకొన్నవాని నిమరలరోముకు పిలిపించుటకై పెరుసియన్ యుద్ధమునకు కారణభూతురాయెను. చక్రవర్తిని, మెస్సలీనా ప్రియాన్వేషణకై నీచపురుషులమధ్య తిరుగుచున్నప్పటికిని, విశేష ప్రభువులను తన అంతఃపురమున కాపలానుంచి రాజసభ చేయుచుండెను.

కాని యే దేశ స్త్రీలు నేడందరికి యాదర్శప్రాయమగుచున్నారో, యేవారి చక్రాధిపత్యముపై సూర్యుడస్తమింపడను సామెత యేర్పడెనో అట్టి బ్రిటను ద్వీపములో సహితము ౧౮వ శతాబ్ది తుదివరకు స్త్రీలస్థితి చాల తుచ్ఛముగ నుండెను. వారు తమభర్తల ఆస్తులలో నొక వస్తువుగ మాత్రమే పరిగణింపబడుచుండిరి వారికి తమయిష్టమను మాటయే లేకుండెను. వారిభర్తలు దయావిహీనులై వారిని పశువులమాదిరి సంతలలో విక్రయించుచుండిరి, ఉదాహరణార్థము ఒకానొక ప్రభువు తన బంటువాని భార్యపై మోహముజెంది ఆమెను వెలకుకొనెను ఒక కూలివాడు తనభార్యమెడకు త్రాడుకట్టి సంతకు తీసికొనిపోయి యొక మోచివానికి ౫ పెన్నీలకు అమ్మెను. ఈయాచారమేమన పూర్వగ్రంథములలో కానుపించుచున్నది హరిశ్చంద్రుడక్కడ తనపట్టపుదేవి చంద్రమతిని ఒక బ్రాహ్మణునికి విక్రయింపగలిగెను మరియు ధర్మరాజు తనసతి ద్రౌపదిని జూదములో పందెముపెట్టి ఓడగలిగెను. ఇప్పటికిని కొన్ని దేశములందీ యాచారమున్నది.

ఇట్లు ప్రథమమున పురుషులకు బానిసలుగ నుండి వారిచే నణగద్రొక్కబడి క్రమేణ పైకి వచ్చుచు, ఋగ్వేదకాలము నాటికి భర్తల కాలోచన చెప్పుటకును సభలలో దమ యభిప్రాయముల నొసంగుటకును అధికారమును సంపాదించిరి. విద్యా విజ్ఞాన విషయములందును వినుతికెక్కిన, లీలావతి, గార్గేయి సీత సావిత్రులు బయలుదేరిరి. కాని, ఎప్పుడైతే మన దేశముపై పరదేశీయుల దండు పడెనో, మరియు జాతిమతభేదము లేర్పడెనో, అప్పుడు స్త్రీలప్రాముఖ్యత మరల అడుగంట దొడంగెను. తుదకు వారశక్తులనియు, అబలలనియు, గృహకార్యములచేయుట పిల్లల కనిపెంచుటతప్ప ఇతర బహిరంగకార్యము లొనర్ప అసమర్థలనియు యెన్నబడజొచ్చిరి. ఎప్పుడైతే ఈభావ మేర్పడెనో స్త్రీల యధఃపతన మారంభమాయెను. పురుషులు సర్వవిధములైన హక్కులను తమకనుకూలముగ నేర్పాటు చేసికొనిరి, విద్యార్జనకూడ తమకేముఖ్యమని తమకై దానిని ప్రత్యేకపరచిరి. అన్నివిధములచేతను, స్త్రీ సంపూర్ణముగ తమపై ఆధారపడినట్లామె పరిస్థితులను మార్చిరి. కాని ఎన్నిదినములీ స్వార్థపరత్వము? "హస్తికొక కాలమున్నచో మశకమునకు కూడ నొక కాలమున్నదికదా!" స్త్రీలలో కూడ మరల నొకవిధమైన చలనముచేయుట మొదలాయెను. వారికన్నులు మొదటనుండు అంధకారపటలము విచ్ఛిన్నమాయెను. తమస్థితిని [illegible]

భూమి తనఖా బ్యాంకులను స్థాపించుటయా స్థాపించకుండుటయా అను ప్రశ్నలో బాధ్యతయంతయు రాష్ట్రప్రభుత్వమునకే వదలివేయబడినది. అవసరమైనచో ఇండియా ప్రభుత్వమువారు తగినసలహా నొసంగుటకు మాత్రమేర్పాట్లు చేయుదురు.

రిజర్వుబ్యాంకుకు ఒకశాఖగా వ్యవసాయదారులకు అప్పులిచ్చు సంస్థను ఏవిధముగా ఏర్పరచి నడిపించవలెనని సూచించుటకై యం యం. డార్లింగు ఐ సి యస్ గారు నియమింపబడినారు. ఈ క్రొత్తసంస్థ రాష్ట్రములలో సహకారోద్యమ సహాయమును పొందవలసియుండును.

ఇండియాలో సరకు విక్రయము ఏర్పాట్లను బాగుచేసి ఉత్పత్తిదారులకు లాభము కల్గించుటకై కొన్ని ఏర్పాట్లు అంగీకరింపబడినవి. (౧) ఇండియా ప్రభుత్వమువారు కేంద్రములో ఒక మార్కెటు ఆఫీసరును నియోగించెదరు. [ప్రస్తుతము లివింగుస్టోను అనువారు నియోగించబడినారు.] (౨) రాష్ట్రప్రభుత్వముల మార్కెటింగు ఆఫీసర్లు, [౩] రాష్ట్రములలో విక్రయసౌకర్యములను ఏర్పరచుటకై ముందుగా సర్వేచేయుటకు రాష్ట్రప్రభుత్వముల ప్రారంభించుట [౪] మొదట నూనెవిత్తనములతోను పొగాకుతోను ప్రారంభించి ఈవిధముగా భారతదేశమందు ముఖ్యమైన వ్యాపారపు పంటలవిషయమును ప్రత్యేక కమిటీలనేర్పరచుట [౫] ధాన్యములను శ్రేణులనుగా విభాగించుటకు పద్ధతులనేర్పరచుటకై వ్యవసాయ పరిశోధనయొక్క ఇంపీరియల్ కౌన్సిలు సలహాతో పనిచేయుట.

డాక్టరు అన్సారిగారు

నూతన స్వరాజ్య పక్షమునకు అధ్యక్షుడు

ఇండియాలో పాలయొక్క భౌతిక రాసాయనిక గుణములన్నింటిని పరిశోధించుటకై ఒక సంస్థ ఏర్పరచబడి, ఇంపీరియల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ అనిమల్ హస్బెండ్రీతో చేర్పబడును.

ఇండియాలో మొత్తముమీద ఎంతపంట అవసరమంచనాలువేసి అంతవరకుమాత్రమే పండించుటకు ఏర్పాట్లు చేయువిషయమై ఆలోచించుటకు మరల మున్నుకాలము వచ్చులోపలనే రాష్ట్రప్రభుత్వముల వ్యవసాయ శాఖాధ్యక్షులయొక్కయు భూమ్యాదాయ శాఖోద్యోగులయొక్కయు సమావేశమొకటి జరుపబడగలదు

ఇతరదేశములలో వ్యాపారసౌకర్యములను వృద్ధిచేయుటకై ఇండియాతరఫున ట్రేడుకమిషనర్లను నియమించుటకు తీర్మానించబడినది.

దేశమందు రోడ్లను బాగుచేయుటకును వృద్ధిచేయుటకును సూచనలు [illegible] ప్రభుత్వములు కోరబడినవి.

వ్యవసాయ పరిశోధనకై కేంద్ర సంస్థవలెనే పారిశ్రామిక పరిశోధన [illegible] కేంద్రసంస్థయొకటి స్థాపించుటకు తీర్మానించబడినది

ఈమధ్య డాక్టరు [illegible] ప్రొఫెసర్ రాబర్ట్సన్ గారును [illegible] ప్రభుత్వము వారి కోరికపైవచ్చి దేశమందు ఆర్థిక సంబంధమైన ప్రణాళికలకు అవసరములగు లెక్కలను సిద్ధముచేయుట కొకవిధానమును సూచించియుండిరి. ఇండియా ప్రభుత్వమువా [illegible] లెక్కలు చాలా అవసరమనియే తలచు [illegible] వివేదికనుగూర్చి ప్రత్యేకముగా ఆలోచించ [illegible]

[illegible]

[illegible] టెలిఫోనులనేర్పరచుటకై [illegible] ఏర్పాట్లు చేయుటకై టపాశాఖవారు సూచనలను చేసినారు.

లండనులో వివిధ దేశములసభ

లండనులో నిపుడు అనేకదేశముల ప్రతినిధులు పేటెంటుహక్కులు, కాపీరైట్లు, ట్రేడుమార్కులు మొదలగు పారిశ్రామిక సమస్యలనుగూర్చి ఆలోచించుచున్నారు. వీరు పారిశ్రామిక రక్షణోద్దేశ్యముతో స్థాపింపబడిన ఇంటర్నేషనల్ యూనియను లో సభ్యులై యున్నారు. ఈమహాసభయొక్క గతసమావేశము ౧౯౨౫ లో జరిగెను.

స్త్రీలకు రాయబారులపదవులు

ఇపుడు అమెరికాలోను, రష్యాలోను స్త్రీలకు విదేశములలో రాజకీయ రాయబారుల పదవులను ఇవ్వ నిరాకరింపక యిచ్చుచున్నారు. ఇంగ్లండులోకూడ త్వరలో స్త్రీలకు అట్టి అర్హత, అవకాశములు ఒసగబడుచున్నవి.

బ్రిటనులో క్రొత్తయిండ్లనిర్మాణము

బ్రిటనులో మార్చితో ముగిసిన ౬ నెలలలో ౧౪౦౦౦౦ ఇండ్లు కట్టబడెను. ఇందులో ౧౧౦౦౦౦ ఇండ్లు ప్రభుత్వసహాయము లేకయే కట్టబడెను. ఉత్పత్తివృద్ధికి దబ్బు సులువుగా చిక్కుటయు, ఆదేశములో ఆర్థికస్థితి బాగుపడుటయు, ప్రభుత్వమువారి సహాయము ఇరుకుసందులను బాగుచేయుటకై కట్టింపబడు ఇండ్లకుమాత్రమే ఒసగబడుటచే ప్రభుత్వసహాయప్రాపు తప్పిపోవుటయు కారణమని ఆరోగ్యశాఖామంత్రి పార్లమెంటులో తెల్పెను.

ఇంగ్లండు డెన్మార్కుల వ్యాపారము

ఇంగ్లాండుకును డెన్మార్కునకును జరిగిన వాణిజ్య సంధి ౧౯౩౩ జూనులో అమలుకువచ్చెను. ౧౯౩౭ మార్చి ౩౧ తో అంతమగు ౯ నెలలలో డెన్మార్కునుండి దిగుమతి చేయబడిన సరకుల మొత్తము విలువ రు ౫౯౦౦౦ పౌనులు. డెన్మార్కుకు బ్రిటనునుండి చేయబడిన ఎగుమతులు ౯౩౨౨౦౦౦ పౌనులు.

బ్రిటిషుజపాను సంభాషణలు

బ్రిటిషువారికి జపానువారికి ప్రత్తిపరిశ్రమ విషయమై సంభాషణలింకను జరుగుచున్నవి. ఎంతవరకు ఫలితము సాధింపబడినదియు ఈబారములో ఫలితము పార్లమెంటులో తెలియచేయబడును.

జర్మనీ బాకీలు

జర్మనీదేశము ఇతరదేశములలో తెచ్చిన బాకీలవిషయమై బర్మని అధికారులయొక్కయు బాకీదారులయొక్కయు సభ బెర్లినునగరములో జరుగుచున్నది, బ్రిటిషు దేశము వారియిచ్చిన అప్పులపై వడ్డీని వసూలుచేయుట కొకపద్ధతి పార్లమెంటులో సూచింపబడగా హైమనుగారు రాయబారములు జరుగుచుండగా తొందరవలదని చెప్పిరి.


ZANDU Pharmaceutical Works Ltd. Bombay

జాండూవారి సుప్రసిద్ధ ఆయుర్వేదౌషధములకై

అఖిల భారత ఆయుర్వేద ప్రదర్శనములలో సువర్ణపతకములు బహుమానింపబడినవి.

అన్ని రకముల ఔషధములు. గొప్పగా యంత్రములచేత సిద్ధపరుపబడుచున్న ఈ ఔషధములు భారత దేశమందంతటను బహుళముగా వాడబడుచున్నవి.

ద్రాక్షాసవము

నరములకు బలమిచ్చు రుచిగలపానీయము శ్వాసకోశములకు బలమిచ్చి దగ్గు ఆయాసము మలబద్ధము తొలగించును. త్రాగుడుయొక్క అలవాటులను తొలగించును.

౧౪ పౌను బి. జి. రు ౨-౦-౦
౧ పౌను బి. జి. రు ౧-౯-౦
౪ పౌను బి. జి. రు ౦-౧౪-౦

Drakshasava
DOSE
ZANDU PHARMACEUTICAL WORKS LTD
BOMBAY

ZANDU'S Malaria Mixture
THE ZANDU Pharmaceutical Works Ltd BOMBAY.
MALARIA MIXTURE

మలేరియా మిక్స్చర్

చలివిడుచు జ్వరములకు గొప్పనివారిణి కడుపులో జ్వరబిళ్లలను పోగొట్టును, ప్రతిఖురాకును గుణమివ్వగలదని గ్యారంటీ నిచ్చుచుందుము.

౧ బుడ్డి బి. జి. ౦-౧౩-౦
వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

కేసరీ జీవన్

దుర్బలుల పాలిటి కల్పవృక్షము వీర్యమును పుష్టిపరచి బలమును ఉత్సాహమును జేయును పత్యములేనిమందు క్షయ మొదలగు వ్యాధులకు అద్భుతనివారిణి.

౧ పౌ బి. జి. రు. ౫-౦-౦ ౪ పౌను బి. జి. రు. ౨-౧౨-౦ ౦|౦ పౌను బి. జి. రు. ౧-౯-౦

ఏజంట్లు:— డోండే బ్రదర్సు కింగ్ అండ్ కంపెనీ
[illegible] రసిడెన్సి అఫ్జల్ గంజి హైదరాబాదు
సోల్ ఏజంట్లు:— ... ... డి. జె. కౌరెఖ్ అండ్ కో




## ఆల్వారు సేనల జీతములవృద్ధి

### అన్య రాష్ట్రీయులకు ఉద్యోగములు

### ప్రధానమంత్రి పీలీగారి సైనిక సంస్కరణము

అల్వారు సంస్థానమందునుండి మహారాజాగారిని పంపివేసిన తర్వాత ఇండియా ప్రభుత్వమువారు ఆసంస్థాన పరిపాలనాధికారము వంతయు యఫ్. డబ్ల్యు పీలీగారిని ప్రధాన మంత్రినిగాచేసి వారికి వశపఱచియుండిరి. ఇది జరిగి సుమారు ఒక సంవత్సరమైనది. అప్పటినుండియు ఇంతకాలము, ఎప్పుడో ఒక్కసారితప్ప, ఆసంస్థానములో శాంతిని స్థాపించుటకై పీలీగారు ఏమిచేసినదియు వినబడలేదు తెలిసిన ఒక్కసారియైనను శాంతిస్థాపన తర్వాత ఆసంస్థానమందలి పరిపాలనా పద్ధతిని సంస్కరించుటకై వీరీగారు చురుకుగా పనిచేయుచున్నారని మాత్రము తెలిసినేకాని ఏమి చేయుచున్నారు అను విషయమున వివరములు తెలియరాలేదు.

ఇప్పుడే మే ౧౮ వ తేదినాడు ఆల్వారునుండి వెలువడిన యునైటెడు ప్రెస్సువార్త పీలీగారు ఆల్వారు సంస్థాన సేనలను పూర్వములోకంటె మంచిస్థితికి దెచ్చుటకై ఒక విధానమును ఆసంస్థాన ప్రధాన సేనానాయకుడగు కర్నల్ అబ్దుల్ రహిమానుఖాన్ గారి సాహాయ్యముతో తయారుచేసిరని తెల్పుచున్నది. ఆల్వారు సంస్థాన సేనలను బ్రిటిషు సేనలవలె తయారుచేయుటయే ఆవిధానమువలని పరమ ప్రయోజనము.

ఈవిధానమందలి కొన్ని ముఖ్యాంశములను పేర్కొనెదము. ఇదివరకు ఆల్వారు సంస్థానములో సైనికులకిచ్చు జీతములు సాధారణముగా వారి కీయదగినంతకంటె తక్కువగా నున్నవని ఇప్పుడు వాటిని హెచ్చించినారు. అంతేకాక సైనికులలో ఒకదానికంటె నొకటి హెచ్చుగా నిట్లు అనేకవర్గము లుండునుగదా! క్రింది వర్గము నుండి సైనికులకు పరీక్షలద్వారా ప్రమోషను చేయించు ఏర్పాట్లు చేయబడినవి. సంస్థానములో సేనలకు నాయకత్వము వహించుటకై బైటినుండి ముగ్గురు అనుభవశాలురు—ఇదివరకు సైనికశాఖలో పనిచేసి చాలించుకొన్నవారు—పిలిపించబడినారు. సైనికశాఖలో గొప్ప అధికార పదవులకు చేరదలచు స్థానికాభ్యర్థులకు సంస్థాన సైనికోద్యోగులు మంచి శిక్షణ నొసంగుటకు ఏర్పాటు చేయబడినది. సంస్థాన సేనలలో ఎన్ని యూనిట్లు గలవో అన్నియూనిట్లపైఅధికారము వహించి ప్రధాని న్యాయాధిపతికి రెండవ అధికారిగా పనిచేయుటకై క్రొత్త అధికారి త్వరగా నియమింపబడును. సైనికుల రోగముల చికిత్సకు ఒక సైనిక చికిత్సాలయమును సేనలో నుండు గుఱ్ఱముల చికిత్సకు ఒక పశు చికిత్సాలయమును ఏర్పాటుచేయబడినవి.

## రైతు స్త్రీల మంగళసూత్రముల ద్రెంపుట

### సికారులో జాట్ స్త్రీల ఆగ్రహము

ఏప్రిలు ౨౫ వ తేదినాడు జయపుర సంస్థానములో సికారులో కధియవాడు వద్ద జాట్ స్త్రీల మహాసభ యొకటి జరిగెను. పోలీసువారుఖుఫ్యావారును ఎక్కువమంది కాపలా యుండిరి. మహాసభకు ౨౦౦౦ మొదలుకొని ౪౦౦౦ వరకు స్త్రీలు హాజరైయుండిరి. ఠాకూర్ శాన్ రాజసింగుగారి భార్యయగు శ్రీమతి ఉత్తమాదేవిగారు సభాధ్యక్షత వహించిరి మహాసభవారు ఠాకూరులుచేయు అనేక క్రూరకృత్యములను దూషించుచును. తీర్మానము లయందు పేర్కొనబడియున్న క్రూరకృత్యములను చేసినట్టివారి శిక్షించుటను జయపుర సంస్థానాధికారులు చర్యగైకొనవలెనని కోరుచును, యువకులను యువతులను వాలంటీర్ల దళము లలోచేరి సికారు రైతుల కోరికలు సాధింపబడుటకు తోడ్పడవలసినదని కోరుచును తీర్మానములు చేయబడెను.

ఈ ఠాకూరులెవరు? వారుసికారులో జాట్ స్త్రీలకు కలిగించు బాధలేవి? అనువిషయమున ఉత్తమాదేవిగారి అధ్యక్షోపన్యాసమున వివరములుగలవు.

"ఈక్రూరకార్యములు" జాట్ స్త్రీలు ధరించు మంగళసూత్రములను ఈవిధముగా త్రెంచుటయు అందరికిని ముఖ్యముగా రాజపుత్రులకు తలవంపు కలిగించవలెను. పురాణాకాలములో రాక్షసులును, పిశాచములును మాత్రమే స్త్రీలపైకిఎగబడి వారి మంగళసూత్రములను త్రెంచినట్లుగలదు. కానిక్షత్రియులు మంగళసూత్రములను కాపాడినవారుగా ప్రశంసింపబడియున్నారు. ఆ క్షత్రియులు తమపూర్వులేయని ఈనాటిరాజపుత్రులు అనుచున్నారు. కాని ఇందుకు విరుద్ధముగా ఠాకూరులు తమపనులవలన ప్రాచీన క్షత్రియులకంటె రాక్షసపిశాచములనే ఎక్కువపోలియున్నట్లు రుజావుచేసినారు.

"అయితే ఈపరిస్థితులు ఇట్లే యుండజాలవు. ఈపరిస్థితులు మారునా అనగా మనకు చావా బ్రతుకా అనుప్రశ్నయే. తల్లులగౌరవమును సవాలు చేసినారు. ౨౦ వశతాబ్దిలో సంఘమునందు మనము మనస్థానము నుంచుకొనవలయు నన్న మనము సవాలును అంగీకరించ వలసియున్నది. రాజపుత్రమనుష్యులు ఇంతనీచస్థితికి వచ్చినారు కాబట్టి ఈపరిస్థితుల నెదుర్కొనుటకు రెండేమార్గములుగలవు. ఒకటిరైతులు ముఖ్యముగా జాటులు తమస్త్రీలగౌరవమును కాపాడుటకు తయారై యుండవలెను. అట్లువారు చేయనిచో మనమే వారికి పాఠమునేర్పవలసియున్నది" అని అధ్యక్షిణి ఉపన్యసించి ఈరెండుపద్ధతులలో మీరేదికోరుకొందురని అడుగగా అక్కడిరైతులు "మేము సిద్ధముగానున్నాము" అని అఱచిరి.

## కధియవాడు యువజనసంఘ కేంద్రీకరణ యత్నము

కధియవాడులో అక్కడక్కడనుండు యువజన సంఘముల నన్నింటిని రాజకోటలోనో అమ్రేలిలోనో ఒకకేంద్రమునకు లోబడి పనిచేయునట్లు చేయుటకు యత్నముచేయుచున్నారు. ఇట్లుచేసినవెంటనే కధియవారు రాష్ట్రములో నంతటను హరిజనోద్ధరణ ప్రచారమున్ను, గ్రామోద్ధరణ ప్రచారమున్ను చురుకుగా జరుగును. మహాత్ముడు జాతెనెలలో ఆరాష్ట్రములో హరిజననిధి వసూలుకై సంచారమును ప్రారంభించుటకుముందే ఈప్రచారములను పూర్తిచేయుటకు యత్నము చేయుచున్నారు.

## రాజ్యపాలనమందు ప్రజలకు అధికారము

### కచ్ సంస్థాన ప్రజా మహాసభయొక్క ఏకగ్రీవ తీర్మానము

భుజ్ లో ఇపుడు జరుగుచున్న కచ్ సంస్థాన ప్రజా మహాసభవారు ఏప్రిలు ౨౯, ౩౦వ తేదులలోను మే ౧వ తేదినాడును సాయంకాలము వేళలలో సమావేశమై పలు తీర్మానములను చేసిరి, అందు ముఖ్యమైనది ఏప్రిలు ౨౦ వ తేదినాడు ప్రజాపాలన పద్ధతిని అవలంబించవలయునని గావించిన తీర్మానము ముఖ్యమైనది, ఈ తీర్మానముచే మహాసభవారు కచు మహారాజా గారిని తమ సంస్థాన పాలనమును ప్రభుత్వమువారు అందరి ప్రజలచే వారిప్రతినిధులుగా ఎన్నుకొనబడిన సభ్యులుగూడిన శాసనసభకు జవాబుదారులుగా నుండి జరుపు పద్ధతిని స్థాపింపబడవలయునని మహారాజాగారిని కోరిరి: ప్రజలచే ఎన్నుకొనబడిన సభ్యులుగల పురపాలక సంఘములను, గ్రామ పంచాయితీలను ............ లను స్థాపించవలసినదని సభవారు మహారాజాగారిని కోరిరి. పరిపాలనములో ప్రజల కర్తవ్యము ............ రాజ్యాంగవిధానమును ............ యొకటి నియుక్తమయ్యెను. ఆ — నెలలలోగా నివేదికను సిద్ధముచేయవలసినట్లును, తర్వాత మహాసభవారొక ప్రత్యేక సమావేశములో ఆనివేదికనుగూర్చి ఆలోచించ వలసినట్లును నిర్ణయింపబడెను

ఈ తీర్మానమును ప్రతిపాదించునపుడు ప్రతిపాదకులగు బిహారిలాల్ అనంతానిగారుచేసిన ఉపన్యాసము చాల తీక్షముగానుండి సభవారిని ఉద్రేకపూరితుల ............ నుండెను. బిహారి అనంతానిగారు ప్రస్తుత కచ్ మహారాజాగారు ౫౦ ఏండ్లక్రిందట సింహాసనమెక్కినపుడు తమతండ్రి తాతలవలెనే తాము ప్రజానురాగముతో ప్రజల ఐహికాముష్మికాభివృద్ధి ప్రధానముగా నెంచి పరిపాలన చేసెదమని ప్రకటించియుండిరని చెప్పిరి. ఈప్రకటన ప్రజాప్రతినిధులతో నేర్పడినశాసనసభకు ప్రభుత్వమువారు బాధ్యతవహించుపద్ధతి ప్రత్యేకముగా పేర్కొనబడలేదు. కాని ఆరోజులలో బ్రిటిషు ఇండియాలోనే ప్రజలకు బాధ్యతవహించు ప్రభుత్వము లేకుండెను. అందువలన యిప్పటి పరిస్థితులనుబట్టి ఆలోచించినచో బాధ్యతాయుత ప్రజా ప్రభుత్వమే ఆప్రకటనలో చెప్పబడినట్లగునని అనంతానిగారు చెప్పిరి

ప్రకటనలోని వాగ్దానము మరలమరల ఇట్లు అనేక పర్యాయములు చేయబడెను. కాని కచు ప్రజా మహాసభయొక్క మొదటి సమావేశము తరవున కొందరు రాయబారులు మహారాజాగారిని ప్రార్థింపగా మహారాజుగారు పరిపాలనలో ప్రజల సలహాగైకొనుట ఎట్లుఅని ఆలోచించుచున్నామని చెప్పిరి. ఈమాటలు మహారాజాగారు రాజనీతియందు ఔదార్యము గలవాడని ప్రసిద్ధిని కల్లచేయుచున్నదని అనంతానిగారు చెప్పిరి. ప్రపంచమందంతటను బహుకాలముగా నిరంకుశులై పరిపాలించినవారి మకుటములు యిప్పుడు మట్టిలో దొర్లాడుచున్నవనియు, అంతటను ప్రజల అధికారము ప్రాచీనతములైన నిరంకుశాధికారులనుకూడ చేతికొకసంచి యిచ్చి పంపివేయుచున్నదనియు, కచ్ సంస్థాన ప్రజలు మహారాజుగారియెడ ఎంతో భక్తివిశ్వాసములు కలవారై యుండినను మహారాజుగారు ఎవరో కుక్షింభరులు లేక స్వార్థపరులు చెప్పు ప్రియవచనములను మాత్రమే వినుచున్నారనియు అనంతానిగారు చెప్పిరి. "ప్రజలు ఎట్లైనను తుదకు పరిపాలనమందు అధికారమును సంపాదించుకొనగల్గుట నిశ్చయము. కాబట్టి మహారాజుగారు ముందుగానే స్వయముగా దానిని గౌరవముతో ప్రజల కిచ్చుటకు ఇది సమయము. ఇప్పుడు సంస్థానములో శాసనసభ (అసెంబ్లీ) యొకటి గలదు. కాని అది అర్థశతాబ్దిగా పనిచేయుటయేలేదు. అపుడు ప్రజలుకోరునదేమనగా ఆ అసెంబ్లీ పరిపాలనమును నడుపునట్లు చూడవలయును. రావు దేశాయిజీగారు ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రభువుగాసింహాసన మెక్కియున్నారు," అని అనంతానిగారు ఉపన్యసించిరి.

మహాసభవారు గావించిన మఱియొక తీర్మానము బలవంతముగా పనిచేయించు పద్ధతిని ప్రభుత్వము వారు మాన్పించవలెననుచున్నది

ఇంకొకతీర్మానము ప్రభుత్వోద్యోగములలో కచు ముస్లిములు హిందువులు అను భేదములేకుండచేసి వారివారి యోగ్యతనుబట్టి ఒకపద్ధతి ప్రకారము జీతముల నేర్పరుపవలెననియు. ఎప్పుడో అర్హులైన ముస్లిములు లభించనప్పుడుమాత్రమే హిందువులను నియమించుచు, సాధారణముగా ముస్లిములనే అభిమానించుచుండవలెననియు మహారాజాగారికి శిఫారసుచేసెను.

ఒకతీర్మానము సంస్థాన ప్రభువులకు రక్షణనొసంగు శాసనముయెడ ఆగ్రహమును దెల్పెను. ఇంకొక తీర్మానము కాంగ్రెసువారు సంస్థానప్రజలయెడ ఉపేక్ష వహింపరాదనియు, ఫెడరేషను రానున్నది కాబట్టి వారు సంస్థాన ప్రజలకు కూడ బ్రిటిషు యిండియా ప్రజలతోపాటు హక్కులను సంపాదించవలసినదనియు సూచించుచున్నది.

రాజ్యమందలి వివిధ గ్రామములలో పరిస్థితులను గమనించి ఆయాగ్రామ ప్రజలస్థితికి తగినట్లు వారిహక్కులు వారు

సుస్థిరముంగునట్లు ప్రచారము చేయుటకై నలుగురుగల కమిటీ యొకటి నిర్ణయింపబడెను. మహాసభయొక్క అభిప్రాయము ననుసరించి ప్రజల క్షేమములను జల్లడిచేయుటకై ఒకపత్రికను రాబోవునెలనుండి స్థాపించుటకు తీర్మానింపబడెను. సంస్థానములో బాధ్యతాయుత ప్రభుత్వము స్థాపింపబడిననే తప్ప రిపోర్టు ఈసంస్థానము రానున్న ఫెడరేషనులో చేరరాదని తీర్మానింపబడెను.

కడపటిరోజున సంస్థానమందలి విద్యాసౌకర్యము లు తక్కువగ నున్నవని అసంతృప్తి దెల్పుచు, ౨౦౦ మంది జనులుగల ప్రతిగ్రామములోను ఒక ప్రారంభ విద్యాశాలయు, ప్రతితాలూకా పట్టణములోను ఒక ఉన్నత పాఠశాలయు, ఉపాధ్యాయ వృత్తికి అర్హతనిచ్చు శిక్షణ మొసంగుటకొక కళాశాలయు వివిధ పరిశ్రమలలో శిక్షణ మొసంగుటకొక విద్యాశాలయు స్థాపింపబడవలయునని ప్రభుత్వమువారికి శిఫారసుచేయు తీర్మానము చేయబడెను.

ఇవిగాక ప్రజలు స్వదేశీ నవలంబించవలెననియు ప్రభుత్వమువారు త్రాగుడును నిషేధించవలెననియు, రోడ్లు చక్కగా నుంచబడవలెననియు, పశువులకు మేతభూములు ప్రత్యేకముగా నుంచబడవలెననియు—ఇట్టి మరికొన్ని లోపములు తీర్చవలెననియు తీర్మానించబడెను.

## కొచ్చిన్ రేవు సభ

కొచ్చినురేవు సభ ఈసారి జూను నెల ౧౧ వ తేదినాడు జరుగును. చాలముఖ్యమైన తీర్మానములు చేయబడవచ్చును. రేవుపై అధికార మెవరికి ఎంత ఉండవలెననిదికూడ మహాసభలో తీర్మానింపబడవచ్చును.

## గ్వాలియరులో మనుష్యుల నెత్తుకొని పోవుట

గ్వాలియరు సంస్థానములో మనుష్యుల నపహరించువారు ఎక్కువగుచున్నారు. బందిపోటు దొంగలు ధనవంతులను పట్టుకొని తమకోరిన ధనమిచ్చిననేగాని తాము పట్టుకొనిన వారిని వదలిపెట్టజాలమని బెదరించుచున్నారు. అందువలన మహారాణిగారికిని, పొలిటికల్ ఏజంటుగారికిని, ఇతరులగు గొప్ప అధికారులకును ఈ విషయమై శ్రద్ధ గైకొనవలెనని దిగ తంతివార్తలు చేరినవి.

# కపుర్తలలో అల్లరులు

కపుర్తల మహారాజాగారు ఇటలీ డిక్టేటరగు ముసోలినీకి ౧౦ వేల లిరలు [ఒకనాణ్యము] యిచ్చిరట. ఈద్రవ్యము ఇటలీలో నియుక్తుడగు కపుర్తల సహాయనిధికై పంపబడెనట.

సంస్థానములో అల్లరులకు విశ్రాంతి కన్పించుటలేదు. మొన్న జరిగిన మొహరం సందర్భమున అధికారులు కొన్ని ప్రదేశములగుండా ఉత్సవములను జరుపరాదని ఎంతశాసించినను మహమ్మదీయులు ఆజ్ఞల నతిక్రమించి తిరుగబడుటచే సైనికాధికారులు కాల్పవలసివచ్చెను. ఇప్పుడు ఈకాల్పవలసిన అవసరములేదని కొన్ని పత్రికలును బ్రిటిషుయిండియాలో కొందరు మహమ్మదీయ నాయకులును ఆక్షేపించుటయు కపుర్తల పోలీసుఅధికారులు కాల్పవలసిన అవసరము వచ్చినప్పటికిని ఎక్కువనష్టము రాకుండ బెదరుటమాత్రమే తుపాకులు కాల్చబడెనని సమర్థించుకొనుటయు విశేషముగా జరుగుచున్నది. ఒకరు అవున ఒకరు కాదనుటలో నిజమేదో గ్రహింప సాధ్యముగుటలేదు. మజ్లిస్ అహ్రారి ఇస్లాం కార్యదర్శియు పంజాబుశాసనసభలో సభ్యుడును అగు మౌల్వి మజహార్ అలీ అజహారేగారు ఏప్రిల్ ౨౭ వ తేదినాటికి సుల్తానుపూరులో మొహరంరోజున కాల్చబడుటచే మరణించినవారిసంఖ్య ౩౦ కి మించినదనియు చెప్పుచున్నారు. ఆనాడు సమీపమునందుండిన పోలీసు ఇన్స్పెక్టరు జనరలు గారు రక్షకభటులు పొంగిపోలేదని కాల్పులు ముగిసియుండెనని యనుచున్నారు. ఇదియట్లుండ గాయపడినవారికి సరియైన చికిత్సా సౌకర్యములు ఏర్పాటు చేయబడుచుండలేదని కొన్నిపత్రికలు ఘోషింపగా ప్రభుత్వమువారు ఇది అసత్యమనియు, మహమ్మదీయుల భోజనమునకై ప్రత్యేకసౌకర్యము లేర్పరుచబడినవనియు సమాధానమిచ్చినారు.

# కాశ్మీరములో అల్లరులు

శ్రీనగరులో ఒకచోట హిందువుల వశములోనున్న భూమిని మహమ్మదీయులు తమదని వివాదమునకురాగా ఇది వరకెన్నడో అధికారులు ఆవివాదమును హిందువుల కనుకూలముగా పరిష్కరించియుండిరి. ముసల్మానులు మరల ఈ సంవత్సరము తమ భూమువివాదమును లేవనెత్తిరి. కాశ్మీరజిల్లా మేజిస్ట్రేటు యీవివాదమును హిందూమహమ్మదీయులుగల ఒకబోర్డువారి పరిష్కారమునకు వదలిపెట్టిరి. బోర్డువారికి మహమ్మదీయులు సాక్ష్యము నొసగలేదు. అందువల్ల వివాదము మరల జిల్లామేజస్ట్రేటునొద్దకే కొనిరాబడెను. జిల్లామేజస్ట్రేటుహిందువులకనుకూలముగా తీర్పుచెప్పి ఈతీర్పుఇష్ట ము లేనివారుదివానికోర్టుద్వారాతమపక్షమునుసాధించుకొనవచ్చుననిరి. అయినను తర్వాతవిమియుజరుగనందున హిందువులు ఆచోట రిపేరీలను ప్రారంభించిరి. ఇంతలో మే ౧ వ తేది మహమ్మదీయులు ఆనేకులువచ్చి రిపేరీపనికి ఆటంకపడిరి. ఇందువలన హిందూ ముసల్మానుల సంఘర్షణము జరుగునని భయపడి ఆడిషనల్ జిల్లామేజిస్ట్రేటు అక్కడకువచ్చి మహమ్మదీయుల యుద్రేకమును శాంతింపజేసి ముసల్మానులు తమ పక్షమున దివానికోర్టునుండి డిక్రీ సంపాదించుకొనుటకై మరియొకవారము గడువొసంగబడునని. ముసల్మానులు ఏమి చేసెదరో చూడవలసి యున్నది.

# నరేంద్రమండలికి సంస్కరణమో అంతమో జరుపజూచుట

నరేంద్రమండలి స్థాపితమైనవాదిగా కొందరిచే మర్యాదనియోగము చేయబడియు మరికొందరిచే బహిష్కరింపబడియు చాలా హీనస్థితికి వచ్చినదనితలచి బికనీరు మహారాజాగారును భోపాలు నవాబుగారును దానిని సంస్కరింపనైన సంస్కరింపవలెను లేదా అంతమొందింపనైన పొందించవలెను అని పట్టుబట్టియున్నారు. మే ౨౦ వ తేదినాడు వీరు బొంబాయికి వచ్చెదరనియు అప్పుడు వారితో మైసూరుదివాను ప్రసిడెంట్ మీర్జాయిస్మాయిల్ గారును, హైదరాబాదు(దక్కను) తరపున సర్ అక్బర్ హైదరిగారును, తిరువాన్కూరు తరపున సర్ సి. పి. రామస్వామయ్యరుగారును సంభాషించగలరు. వారపుడు నరేంద్రమండలియొక్క అధికారములు మొదలగు విషయములలో మార్పుగావించుటకు సూచనల నాలోచించెదరు.

## యుద్ధభయముచే పెకింగులో ప్రార్థనలు

౧౯౩౪ వ సంవత్సరములో అతిభయంకరమగు యుద్ధము జరుగునని జ్యోతిష్కులు ప్రకటించుటచే మంగోలియా, టిబేటుదేశీయులగు లామాలు ప్రార్థనలను ప్రారంభించిరి. చీనాకు చాలనష్టము కలుగుననియు టీన్ట్సిను పెకింగు నగరములు యుద్ధకేంద్రములుగా నేర్పడుననియు జ్యోతిష్కులు సూచించుటచే పెకింగులో ప్రధాన బౌద్ధాలయమగు యాంగ్ క్యాంగులో ౧౦౮ మంది సన్యాసులు కొవ్వొత్తులతో ప్రార్థన చేయుచున్నారు. ఇట్లే ౧౦౮ రోజులు చేయుచున్నారు.

## ఇన్సూరెన్సు డబ్బుకై కారున కాల్చుకొనుట

శివాల్పురరోడ్డువద్ద సేఠ్ రాటుందేల్ ఖండ్ మోటారు సర్వీసు ప్రొప్రైటరగు దస్తురిలాలుగారు తమకారును బుద్ధిపూర్వకము నిప్పంటించి కాల్చుకొనిరి. బొంబాయి గ్రామిల్ కంపెనీవారిని మోటారును భీమాచేసిన మొత్తము ౩ వేల రూపాయలు లోసగవలెనని కోరిరి.

## మందులవలన గర్భమగుట

అమెరికాలో లాంగ్ ద్వీపములో ఇరువురు స్త్రీలకు కొన్ని మందు పదార్థములను దేహములోనికి యెక్కించుటవలన గర్భములువచ్చెను. పురుషసంపర్కము లేక యేయందుకొత్తవులను శరీరములోనికి యెక్కించి గర్భముచేయుట యెట్లు అను విషయమున చిరకాలమునుండి పరిశోధనలు సల్పిన ఒకవైద్యురాలి విధానము ననుసరించి పైచేర్పబడిన గర్భోత్పత్తి చేయబడెను. గర్భోత్పత్తి చేయబడిన స్త్రీలిరువురును వర్ధిల్లుచున్నవారు. ఒకస్త్రీకి పుట్టినబిడ్డకు యిపుడు ౯ మాసములు. రెండవస్త్రీ గర్భవతిగానున్నది. కొలదిమాసములలో ప్రసవించగలదు. ఈవింత గర్భాదానము ౧౨ మంది స్త్రీలకుచేయగా ౨ మందికిమాత్రము సంతానముకలిగెను.

## హిందువులను ముసల్మానులని భ్రమించుట

కరాచిలో మెరియట్ రోడులో ఒకహోటలులో మే ౧ వ తేది రాత్రి కొందరు పంజాబి హిందువులు వచ్చిరి. అప్పుడు అక్కడ భోజనముచేయుచుండిన వారి పంజాబీహిందువులను హోటలులోనికి రానీయ కూడదనిరి. కాని ఆకోరిక నిరాకరింపబడుటచే భోజనము చేయుచున్నవారికి ఆగ్రహము కలిగెను. వెంటనే మెరియట్ రోడ్డువంతయు పోలాబుడ్లుమొదలగువాటితో ఒకరి నొకరిని కొట్టుకొని నింపిరి.

## పొరపాటున చితిలోబడుట

ఏప్రిలు ౨౫ వ తేదినాడు హాంషేరుజిల్లాకు సంబంధించిన యొకముసలివాడు ప్రమాదవశమున ఒకచితిలో బడెను. వెంటనే అతనిని బైటకిలాగి ఆస్పత్రికి గొంపోయిరిగాని అచట నతడుచనిపోయెను.

## చోటానాగపూరులో కన్యావిక్రయము

చోటానాగపూరులో పురుషులసంఖ్య స్త్రీసంఖ్యకంటె మించియుండుటయు, పురుషులు స్త్రీలను బానిసలుగా నుపయోగించుకొన దలచుటయు అక్కడికన్యావిక్రయాచారమునకు కారణములని రాయ్ బహదర్ శరచ్చంద్రరాయ్ గారు తలచుచున్నారు.

## రెండుపెన్నీల స్టాంపులు—౧౮౦౦ పౌనులధర

౧౮౭౫ కనడాలో చెలామణియగుచుండిన రెండుపెన్నీల స్టాంపులు లండనులో ౧౮౦౦ పౌనులకు కొనబడెను.

# వింతలు, విశేషములు

## విషక్రిములను పోగొట్టుకొనుట.

విషక్రిములను సంహరించుటకు మందు త్రాగుటకంటె ఆహారమే మంచిమందట, 140 గ్రాములక్రొవ్వు, 25 గ్రాముల మాంసకృత్తులు, 15 గ్రాములచక్కెర కలిపి తినినచో మూత్రపిండము, మూత్రనాళము, ప్రేగులలోనుండు మలిపురుగుల సంహరించుటకు కావలసినపదార్థము శరీరములో నేతయారగును. ఔషధములను శరీరములోని కెక్కించుటవలన వాటిపరిమితిచాలదు. ఆహారముకలిగాక ఈమందులు నులుపురుగులుండు స్థానములలో చాలకాలముండవు, అని డాక్టరు లెగ్గగారు తెలిపిరి.

పాలు, ఉర్లగడ్డలను ఆహారముగా నుపయోగించుట వలన క్రొవ్వుపెరుగునని చాలమంది తలంతురు. పాలను గంజిగల పదార్థములతో కూడ కలపకపోతే క్రొవ్వు పెరుగదు. ఉర్లగడ్డలు తినుటవలన శరీరసౌష్ఠవమేర్పడి, శక్తినికలిగించు కార్బోహైడ్రేట్టుకూడ శరీరమునందేర్పడును.

## నిర్బంధ స్నానము

పోలెండులోని వార్సాలో కొందరు బిచ్చగాండ్రు స్నానముచేయక చాలఅసహ్యముగా నుండుటచే పోలీసువారి 300 మందిని మోటారులారీలో నెక్కించుకొని, మునిసిపాలిటివారు స్నానమునకై ఏర్పరచిన చెరువులకు తీసికొనివెళ్లి నిర్బంధముగా స్నానముచేయించిరి. స్నానముచేయకుండినచో యిటులనే చేయుచుందుమని పోలీసువారు వర్తకులకు చెప్పిరి.

వచ్చినవి వచ్చినవి. — ఏమిటి?
పెండ్లిండ్ల రోజులు! అయితే ఏమి?
బట్టలుకావలదా! ఎక్కడదొరకును?
కారచోయి జరి చీటీ వగైరా అన్ని క్రొత్తరకములు దొరకును!
ఎక్కడంటే?

ఆర్. ఆర్. గోపాల్, బట్టలవర్తకుడు
అల్లావుద్దీను బిల్డింగు పత్తరుగట్టి, హైదరాబాదు - దక్కను.

# ది సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, లిమిటెడు.

| | | |
|---|---|---|
| మూలధనము | ... ... ... రూ | ౩,౩౬,౦౦,౦౦౦ |
| వసూలయిన మూలధనము | ... ... | ౧,౬౮,౦౦,౦౦౦ |
| రిజర్వు. ,, | ... ... | ౭౦,౦౦,౦౦౦ |

## భీమా పద్ధతి

సెంట్రల్ బ్యాంకు సేవింగ్సు బ్యాంకులో డబ్బు దాచిపెట్టుకొనువారి ఉపయోగార్థమై మేము ...లకు రూ ౧-౦-౦ రూ ౨-౦-౦ అంతతగ్గు మొత్తప్రీమియములతో రూ ౫౦౦లు, రూ ౧౦౦౦లు ...లువగల పాలిసీలను క్రమముగా యివ్వగలము.

## చెక్కులద్వారా సేవింగ్సు బ్యాంకులెక్కలనుండి తీసికొనబడుట

మా కస్టమర్లయొక్క అనుకూలమునకై క్రొత్త సేవింగ్సు బ్యాంకునుప్రవేశపెట్టినాము. అందుం డబ్బును చెక్కులద్వారా తీసికొనవచ్చును.

...వరములకు **ది సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా** కు వ్రాయుడు.

...సిడెన్సీరోడ్డు, హైదాబాదు (దక్కన్). — జేమ్సుస్ట్రీటు, సికిందాబాదు (దక్కన్).



## పాలిసీలు హోలీనా ణెములో నివ్వబడును

స్టార్ 'పాలిసీలు రద్దుకానేరవు. పట్టాలు హాలీలో జారీచేయబడును. అపాయకాల విస్తరణ, ఆకస్మికప్రమాద మరణము వలన రెండింతలలాభము, శాశ్వత అశక్తతలాభములు, సరళమైన సరెండరువిలువలు, గ్యారంటీ చేయబడిన బోనసులు, యింకను యెన్నియో లాభములు గలవు. వివరములకు వ్రాయుడు.

## స్టార్ ఆఫ్ యిండియా ఐ. జి. అస్యూరెన్సు

కంపెనీలిమిటెడ్ (మదరాసు)

బ్రాంచి:— **హనంకొండ (దక్కను)**

పి. యస్. శాస్త్రి,
నిజాంరాష్ట్రమునకు
డివిజనల్ ఆర్గనైజర్

—చదువుకొన్న ఏజంట్లు కావలెను.—



చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును (గనేరియారోగ)వ్యాధికిని

## క్రొత్తగా కనిపెట్టబడిన దివ్యౌషధము

## గనోకిల్లర్ (రిజిస్టర్డు)

GONO KILLER

కృత్రిమములు చూచి మోసపోకుడు. ,,కోడి'' మార్కు గమనింపుడు,

ఈ యౌషధము ఇంగ్లీషు మందులను దేశీయ ఔషధములను పుచ్చుకొనినను గుణము కలుగని యెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలనను గూడ లాభము లేకపోయిన యెడలను కడపటి ప్రయత్నముగా మా గనోకిల్లరును గూడ పుచ్చుకొని చూడుడు. పెక్కుయేండ్లనుండి యున్నను లేక క్రొత్తగాకలిగినను ఏరకము కగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పకకుదుర్చును. మూత్రము ధారాళముగా వెడలును. మూత్రముపోవుచున్నపుడు కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళమునందలి వాపు తీసిపోవును. ఈగ వ్యాధి(గనోరోగము) వలన మూత్రము బొట్టుగాపడుట మేహరోగమువలన మూత్రద్వారమునుండి పోవు తెలుపు, మూత్రద్వారము యొక్క వాపు, మూత్రద్వారముయొక్క చుట్టువుండు పొరయొక్క వాపు, మూత్రాశయముయొక్క వాపు, లేక మూత్రతిత్తియొక్క వాపు, వరములజబ్బు, మున్నగువ్యాధు లన్నియును స్త్రీలకును పురుషులకును గూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెగను) పోవుట, మూత్రవ్యాధులు మున్నగునవికూడ దీనివలన కుదురును. ౫౦ మాత్రలుగల సీసా ఖరీదు రు. ౬-౦-౦ వి. పి. చార్జిప్రత్యేకము.

కృత్రిమములుచూచి భ్రమజెందవలదు. మా ,, కోడి''మార్కు గమనింపుడు.

అడ్రసు:— **డాక్టరు డి. యన్- జస్సాని** గిర్గానువెనుక రోడ్డు బొంబాయి ౪.

**Agent:— D, J: PARIKH & Co, Station Road, Secunderabad**



## అపాయ శకునము

భోజనముపై అని ... రోచము, నిద్ర పట్టమి, ... తక్కట, మనస్సులో వ్యాకులబద్ధము మొదలగునవి

అపాయశకునములు

రోగియొక్క ... ... అమూల్యమైనజీవితము ... నాశము యొుటకు త్వరత్వరగా సమీపించుచున్నాడని ముందుగా రోగికి తెలుపుచుండుటకు ఇవి చాలును. పైజెప్పినట్టి బాధలలో ఏదిగాని ... బాధించుచున్నచో జీవితము ... ను, ... ను, నిద్రోవుతకునుకూడ ఉపయుక్తముగునట్లు చేసికొనుటకు

## ఆతంకనిగ్రహమాత్రల

వలన రక్షణము పొందుట మంచిది

౩౨ మాత్రలుగల డబ్బాకు వెల ౧-౦-౦

## ఆతంకనిగ్రహఫార్మసి,

హెడ్ ఆఫీసు:
జమ్నగర్ (కథియవార్)
బ్రాంచి ఆఫీసు:
౨౬, బ్రాడ్వే, మద్రాసు.



## క్రొత్తరికార్డులు

I నెం FT. 3192 రు ,,శ్రీపతే''—రెండు భాగములు—బ్రహ్మశ్రీ అణ్ణామలై భాగవతర్, కనన్నాథపురం II నెం. FT. 8193 రు ,,సరస సౌభాగ్య''—మంటసాల బలరామయ్యగారు, నెల్లూరు ,, ... గారంగ''(భజన)—ఘంటసాల సోదరులు, నెల్లూరు III నెం. FT. 8194 రు ,,ఆటలాడు కోరా'' ,,గోకులసుఖసదన''—మాస్టర్. ఎన్. ఆర్. పీతాంబరము, బెంగళూరు IV నెం. FT. 3195 రు. ,,కాలము చూకమన్న'' ,ఆహామినపవదా [హాస్యము]— ధరలాక్యార్, మద్రాసు. V నెం FT. 8196 రు. సమష్టిరికార్డు—శ్రీయుత వి. నాగయ్య, డి. శ్రీనివాసాచారి, కే. సి. రామస్వామి అయ్యంగార్లు, శ్రీయుత వి. ఆర్. రావు, ఎన్. ఆర్. పీతాంబరము, బి. ఎన్. పుట్టప్ప గార్లు VI నెం. FT. 2681 ,,తారకమంత్రము''—ఆరణి సత్యనారాయణ.

కేటలాగు ఉచితముగా యివ్వబడును.

అడ్రసు:— బి. జి. చిమలిగి
కాలిగూడ—హైదరాబాదు (దక్కను)



## గోలకొండపత్రికా కార్యాలయమున వెలకుదొరుకు గ్రంథములు

| | |
|---|---|
| హిందువుల పండుగలు | 1-8-0 |
| ఉచ్ఛల విషాదనాటకము | 0-12-0 |
| శిశురక్షణ | 0-12-0 |
| కృష్ణార్జున సంవాదము | 0-6-0 |
| సంఘోద్ధరణ | 0-6-0 |
| కర్నూలురాజ వంశావళి | 0-2-0 |
| కృష్ణాలహరి | 0-1-0 |
| సుధాలహరి | 0-2-0 |
| జీడికంటిరామ శతకము | 0-1-0 |
| బమ్మెరపోతనామాత్యవిజయము (హరికథ) | 0-1-6 |
| తిప్పన్న చరిత్ర | 0-0-6 |
| రఘునాథ | 0-1-6 |
| చారుమీనారు | 0-1-0 |
| పంచముల చరిత్ర | 0-3-0 |
| హాలీకల్దారు జంత్రి | 0-2-0 |
| కార్డు కుబూలియ్యతులు 100 కి | 2-0-0 |
| ప్రాంసరీనోట్లు ,, | 2-0-0 |

వలయువారు,—
గోలకొండపత్రికాలయము త్రూపుబజారు
హైదరాబాదు (దక్కను)

